అంతటి రచనలు 26

ప్రచురణ 1-1-1987.

ప్రతులు 1000



వెల : 6-00

పబ్లిషర్స్ :
డాక్టర్ అంతటి షష్టిపూర్తి సన్మాన సంఘం
హైదరాబాదు.

దొరుకుచోటు :
సమతా సాహితి
3-6-778/2, హిమాయత్‌నగర్
హైదరాబాదు - 29.

ముద్రణ :
శ్రీ లక్ష్మీవేంకటేశ్వర పవర్ ప్రెస్,
హిమాయత్‌నగర్ హైదరాబాదు.

# ఒక్క — క్షణం

భావోద్వేగపూర్ణమైన, రసవత్తరమైన కవితలు మీ ముందుంచి, ఈ మాటలు రెండూ చదవమంటున్నందుకు మన్నించండి. మీకు తెలియవని గాదు గాని, యీ వచనకవితలు యెందుకు వ్రాశానో చెబుతున్నందుకు అన్యథా భావించకండి.

గతంలో, సార్థకాక్షర ప్రయోగంతో ప్రకరణానుగుణ పద ప్రయోగంతో "కంకాళ రాత్రి" పద్యకావ్యాన్ని వెలయించినపుడు పండిత కవులు సైతం సద్విమర్శలు చేసి గ్రంథస్థం చేసిన విషయం పాఠకులకు గుర్తుండి వుండవచ్చు. కవిత్వం అంటే పద్యమే అన్న భావం నాడూ నేడూ గూడా వుంది. సంస్కృతంలో గూడా మహాకవులంతా శ్లోకాలే (పద్యాలే వ్రాశారు.) వాటికి పాద నియమమూ, గణ నియమమూ వుండడం మూలాన, సుశ్రావ్యంగా వుండడమూ కంఠస్థం చెయ్యడానికి అనువుగా వుండడమూ జరిగింది. మహా పండితకవి అయిన బాణభట్టు "కాదంభరి"ని గద్యంలోనే వ్రాసినా అది పద్యం కన్నా మిన్నగా ఆకర్షణీయమైనదని అందరికీ తెలుసు. ఎందుకంటే ఆగద్యంలో వున్న వూపు అటువంటిది గాబట్టి, సంస్కృతంలో అమోఘమైన పాండిత్యంగల కవులే గద్యాన్ని హృద్యంగా, సార్థకంగా నడపగలరు గాబట్టి.

కవులు చాలా మంది వుంటారు. అయితే పండిత కవులు అరుదు- ఆ పండిత కవులు సైతం పద్యాల్లోనే (శ్లోకాల్లోనే) కావ్యాలు వ్రాస్తూ గూడా ఆశ్వాసాంతాల్లో గద్యాన్ని వ్రాస్తూ వచ్చారు. మధ్యమధ్యలో వర్ణనలు తటస్థపడినపుడు పద్యాన్ని పక్కకు నెట్టి, శబ్దసౌందర్యంతో వచనాన్ని- అంటే గద్యాన్ని- వ్రాయడం మనకు సువిదితం. పద్యం

అంటే పాదనియమం గలది అని గదా అర్థం. గణపాద నియమాలవల్ల భావధార దెబ్బ తింటుందని అందరికీ తెలుసు. అందుకే, అమోఘభావ విన్యాసం కోసం, విశృంఖల ధారాపూర్ణ గద్యాన్ని మన కవులు వరించారు.

సంస్కృతం వరకూ పరిస్థితి అంతే! మన తెలుగులో గూడ గత శతాబ్దం వరకూ అంతే. తర్వాత గేయరచన ప్రారంభమయింది. సంస్కృతంలో గూడా వృత్తాల మినహాయిస్తే మిగ్వాతిక భాగం కవిత్వమంతా అనుష్టుప్పు, విద్యున్మాలా, రుగ్మవతి, లయగ్రాహి ప్రమాణి మొదలయిన ఛందో రూపాల్లోనే నడిచింది. దీనిసారాంశం యేమిటంటే గేయరూపకవిత అనాదినుండీ వస్తున్నదే అని!

బ్రహ్మాండమైన పాండిత్యాన్ని గడించే, ఓపికా తీరికా నేటి కవులకు లేని కారణానా, పాఠకులకు గూడా ఆగుణాలు లేనికారణానా, ఖండకవితా రూప అయిన గేయం శరణ్యమయింది.

గురజాడాది కవులు ఈ బాటలో మొదటి పథికులు. కవితా దృక్పథమూ, ప్రయోజనమూ, మారినందువల్లనే గేయరూపకవితావిర్భావం జరిగింది. తెలుగు పద్యంలో వలెనే ఈ గేయ కవితల్లో గూడా పాదనియమమూ, మాత్రాబద్ధతా వుండితీరాలి. ప్రామాణిక భాషకంటే వ్యావహారిక మే ప్రయోగింపబడాలి. ప్రతిపాదమూ, ఆదిలోనో, అంతంలోనో యతి ప్రాసలు కలిగివుండడం ఇందలి విశేషం. అందువల్ల పద్యంలాగే గేయం గూడా కాస్త కష్టమైనదే.

ఈ కష్టాన్ని గూడా అధిగమించి, సులభ గ్రాహ్యంగా వుండాలన్న దృష్టితో వచన కవితావిర్భావం జరిగింది. వచనం కవిత్వం అనిపించుకోదు గదా! మరి వచన కవిత్వంలో కవిత్వం లేదా? కవిత్వం అన్నది కేవలం భావసంబంధమైనది. ఏ నియమాలకూ సంబంధించనిది, సంబంధించినది.

నియమాలు ఎందుకు పెట్టుకుంటున్నాము? సుశ్రావ్యత కోసం. శైలీ నిబద్ధతకోసం. అయితే వచన కవితలో అవి లేవా? వున్నాయి రచన లోనూ పఠనరీతిలోనూ వున్నాయి. ఈరీతి అన్నదే గేయానికి ప్రాణం. ఈ వచన కవితలకు పాండిత్యం అక్కరలేదని అంటారుగాని, పాండి త్యంగల కవి వ్రాసిన వచన కవిత వూపే వేరు. సొంపే వేరు. యింపు లేకపోతే కవిత్వాన్ని ఎవడూ చదవడు. విధిగా నిబద్ధత లేకపోయినా యతి ప్రాసలూ మాత్రాబద్ధతా వచనగేయంలో క్షణక్షణం దర్శనమిస్తూ వుంటాయి.

## ఇక చదవండి

ఈ కవితా సంపుటిలో ప్రతి శీర్షికనూ గూర్చి, చర్చించను. అయితే కొన్నిట్లోవున్న భావతీవ్రతనూ, వ్యంగ్యాన్నీ, ఉద్దేశించిన ఫలాన్నీ కొద్దిగా వివరించదలిచాను. మీపాండిత్యాన్నీ, మీ భావుకత్వాన్నీ అవగా హన శక్తినీ, కించపరుస్తున్నట్లుగా భావింపవద్దు. నేను ఏ సందర్భాల్లో, ఎలా స్పందించానో చెప్పడానికే ఈ కవితా సంపుటిలో 1) ఇప్పుడే 2) మారినవేదం 3) బుద్ధిజీవి 4) దోపిడి.

మొదటిది "ఇప్పుడే" అనే శీర్షిక. సమాజంలో తక్షణం మార్పు రావాలన్న ఆకాంక్ష అందులో వుంది. మార్పు ఎందుకు? ఈ సమాజంలో మొదటినుండీ వున్న కులవ్యవస్థ హెచ్చుతక్కువల సృష్టించడమే గాక ఆర్థిక రీత్యా దోపిడీకి పునాదులువేసింది. శరీరకష్టం చెయ్యని కొద్దిమంది ఎండావానల్లో గూడా పనిచేసి ఉత్పత్తులకు కారకులైన బహుళ జనాన్ని దోపిడీ చేసే వీలుకల్పించింది. స్వరాజ్యం వచ్చాక అయినా ఆస్థితి మారు తుందని ఆశించాం. కాని అది ఇంకా ఎక్కువైంది. ఉన్నట్టే వుంది. కొంతమంది లక్షాధికార్లూ కోటీశ్వరులూ కావడం మన కండ్లతోనే చూస్తు న్నాం. ఈ దోపిడీనే వృక్షానికి మేడలకూ సాటి చెప్పి వర్ణించడం జరిగింది.

వేళ్లు భూమిలోకి అంతకంతకూ లోతుగా చొచ్చుకొని పోయి పోనూ పోనూ వున్న బల ఆహారాన్నంతా పీల్చి వృక్షానికి అందిస్తే అది అంతకంతకూ ఎదిగి లావెక్కి పోతున్నది. అయితే అది ప్రకృతి. వాటికి అవినాభావ సంబంధం వుంది. అన్ని భాగాలూ కలిసి ఒకే ప్రాణం ఇవి వేరు. గుడిసెలా మేడలా, బాంధవ్యం వేరు. గుడిసెలున్నాయి అంటే మేడలున్నాయన్న మాటే. గుడిసెలపైన అవి ఆధారపడి వున్నాయన్నమాటే పిల్ల వేళ్ళ నుండి ఆహారాన్ని లాగి లాగి వృక్షం బలిసిపోయినట్టే, గుడిసెలు సృష్టించిన సంపత్తులనూ స్వార్థశక్తులు హరించి మేడలుకట్టి ఈ గుడిసెలను అట్లాగే వుంచుతున్నారు. గుడిసెల సంఖ్యను పెంచుతున్నారు. ఈ పరాక్రమణ ఇట్లాగే సాగితే ప్రజల్లో విప్లవం చెలరేగుతుంది. దాన్ని జరగకుండా చూడాలంటే ధనాఢ్యుల దృష్టి మారాలి. తాము అంతకంతకూ ఎదిగిపోవడం కాస్త ఆపి, ఈ గుడిసెలు కనీసం డాబాలయ్యేలానైన చూడాలి. లేకపోతే వినాశనం తప్పదు అన్న హెచ్చరిక అందులో వుంది. "ఇప్పుడే మారాలి" అన్నదే ఆ హెచ్చరిక.

"మారినవేదం"లో వ్యంగ్యం ఎక్కువగా చోటు చేసుకున్నది. నీతిని అన్యాపదేశంగా చెప్పడమన్నదే వ్యంగ్యం. భగవద్గీతలోనూ, ఉపనిషత్తులలోనూ చెప్పబడిన నీతులను ప్రస్తుత సమాజంలో ఏ విధంగా పాటిస్తున్నారో, ధర్మశాస్త్రాలలో కులవ్యవస్థా, స్త్రీ బానిసత్వమూ ఎలా వున్నాయో వాటిని ఎత్తిచూపుతూ ఎలా వుంటే బాగుంటుందో అన్న దానిని చెప్పకుండా చెప్పడం జరిగింది.

"బుద్ధిజీవి" ద్వారా సమాజంలో చదువుకున్న వాళ్ళవల్లే నాడూ నేడూ కూడ అన్యాయం జరిగిందీ, జరుగుతున్నదీ అని నిరూపించబడింది. చదువుకున్నవాడు శరీర కష్టం చెయ్యకుండా శరీరకష్టం చేసేవాళ్లపైన పరజీవిగా వుంటూ, వాళ్లకు అన్యాయం సర్వదా చేస్తున్నాడన్న దానిని

వ్యంగ్యంగా చెప్పడం జరిగింది. అలా జరగకూడదు అని వ్యక్తంగా చెప్పకపోయినా, జరగగూడదు అని వ్యంగ్యంగా చెప్పడం జరిగింది.

'దోపిడి అన్నదానిలో మతా వ్యంగ్యమే కనిపిస్తుంది. కులవ్యవస్థ దుర్మార్గమైనది. నీచ వృత్తులను వంశ పారంపర్యంగా చెయ్యడానికి కొన్ని కులాల సృష్టించి వాటిని చదువు మొగం చూడనీకుండా, వెలుగులోనికి రానీకుండా దౌర్జన్యంగా అయినా సరే అణగద్రొక్కడం తరతరాలుగా వస్తున్నది. అందులోనుండి బయటపడితేనేగాని సమాజానికి మోక్షంలేదు అన్నది వ్యంగ్యంగా స్ఫురింపజేయబడింది. "పందుల మేపే వోటరు" పేరులోనే ఎంతో వ్యంగ్యం వుంది.

ఈలాగే రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధనాది ఉగాది పండుగలకు స్పందించి ఆయా సంవత్సరాల్లో జరిగిన దురంతాలనూ, అనాదిగా సమాజాన్ని పీడిస్తూ వస్తున్న దురాక్రమణ దౌర్జన్యకారుల దుష్టత్వాన్ని, తలుచుకొని విచారించి, జరిగే సంవత్సరాల్లో నయినా ఆ పీడకుల బారినుండి సమాజాన్ని రక్షించాలన్న విధానాల గూర్చి ఆలోచించి, ఆలోచించే కొద్దీ భావోద్రేకమూ, కోపోద్వేగమూ అహమహమికతో విజృంభించగా యుద్ధాన్ని ప్రకటించి కలాన్ని కత్తిగా ఝళిపించి, విజృంభించి రచించిన రక్తాక్షరాలతో సమాజ ద్రౌపదీ వేణీ సంహారం గావించడం జరిగింది. కాని యీ సమాజంలో కీచకులూ, దుశ్శాసనులూ సమాజ పీడకులూ, దురాక్రమణదారులూ, దౌర్జన్యకారులూ, మోసకారులూ, దగాకోర్లూ, వంచకులూ తుడిచి పెట్టుకొని పోవడంలేదు అక్షరాలా సామ్యవాదం సార్థకంగా అంటే — కమ్యూనిజం స్థాపితం గానిదే దురాశా వాద దోపిడీలు ఆగవేమో !

చదవండి. మీరూ యీ ధోరణికి రండి

మీ

అంతటి

# విషయసూచిక





# ఇప్పుడే....

నిన్నటి
నిన్నటి అంధకారాంచల రక్తారుణ యవనిక చీల్చుకొని
అదిగో సమవర్తి స్వరూప భాస్కరు డుదయిస్తున్నాడు
దౌర్జన్య పీడిత దీన జనాశ్రు రూప నక్షత్రాల నిరస్తం జేస్తూ
అదిగో అహస్కరు డుదయిస్తున్నాడు.
పృథివ్యప్తేజో వాయురాకాశాలకే హద్దులు గీచుకొని
దురాక్రమణ చేస్తున్న స్వార్థ గ్రహాల నిస్తేజం చేస్తూ
వికర్తనుడు ఉరిమి చూస్తున్నాడు
మనం
మనం నిన్నటి దాకా
ప్రతి చోటా భజనలు చేస్తూనే వున్నాము
సంకీర్తనలు పాడుతూనే వున్నాము
మామిడి చిగురాకులు మన్మథుని బాకులనీ
కోకిలల సహజ రుతాలు మదన ప్రేరకాలనీ
ప్రాకృతికమైన ఋతు ప్రభావ మంద మారుతాలను
రతి ప్రేరక భావ ప్రకంపనాలనీ
ఇంకా ఎన్నో ఎన్నెన్నో గానం చేశాము.
ఇవన్నీ
ఇవన్నీ సాక్షాత్ జీవిత సమస్యలను పక్కకు నెట్టివేసే
ఆత్మ వంచకుల కుహనా సంబోధనాలు.
నగ్నంగా కనిపిస్తూన్న జన ప్రకృతిని చూడకుండా

కళ్లు మూసుకొని మధురోహల తేలియాడే
కవి గాయకుల ఆలాపనలు ప్రేలాపనలు

* * *

చూడు, అటు చూడు
బలిసిన వృక్ష ప్రకాండంలా ఒంటిస్తంభం మేడ
పిల్లవేళ్లలాగా దాని అడుగున చుట్టుకొని పూరి గుడిసెలు
పాపం యీ పిల్లవేళ్ల పనంతా ఖనిజ లవణ నీరాహారాల లాగి లాగి
ఆధేయమైన వృక్షానికి అందించి
దాన్ని బ్రదికిస్తూ, బలిపింప జేస్తూ
తాము మాత్రం యెదుగూ బొదుగూ లేకుండా
బక్క చిక్కి బలహీనంగానే మిగిలిపోతున్నాయి
కాని
కాని, అది ప్రకృతి. సహజ ప్రకృతి
ప్రకాండ సహిత వృక్షం వేళ్లకు ఆధారం
వేళ్లు వృక్షాని కంతటికీ ఆధారం
వీటి రెండింటికి ఆధారాదేయ భావం వుంది
అవినాభావ సంబంధం వుంది
మన తలా, మెడా, మొండెమూ, కడుపూ, కళ్లూ లాగా
పిల్లవేళ్లూ, తల్లివేరూ, ప్రకాండమూ, కొమ్మలూ, రెమ్మలూ
వృక్షానికి అంగాలు, అందాలు, అభేద విభాగాలు.
కాని, ఈగుడిసెలు మేడలోని భాగాలు గావు
వాటికీ వీటికీ ఆధారాధేయ భావం లేదు
అవినాభావ సంబంధం లేదు
గుడిసెలు మాత్రమే మేడలకు ఆధారాలు, ఆహారాలు, అంతే !

కళ్ళు మూసుకొని మధురోహల తేలియాడే
కవి గాయకుల ఆలాపనలు ప్రేలాపనలు

*   *   *

చూడు, అటు చూడు
బలిసిన వృక్ష ప్రకాండంలా ఒంటి స్తంభం మేడ
పిల్లవేళ్ళలాగా దాని అడుగున చుట్టుకొని పూరి గుడిసెలు
పాపం యీ పిల్లవేళ్ళ పనంతా ఖనిజ లవణ నీరాహారాల లాగి లాగి
ఆధేయమైన వృక్షానికి అందించి
దాన్ని బ్రదికిస్తూ, బలిపింప జేస్తూ
తాము మాత్రం యెదుగూ బొదుగూ లేకుండా
బక్క చిక్కి బలహీనంగానే మిగిలిపోతున్నాయి
కాని
కాని, అది ప్రకృతి. సహజ ప్రకృతి
ప్రకాండ సహిత వృక్షం వేళ్ళకు ఆధారం
వేళ్ళు వృక్షాని కంతటికీ ఆధారం
వీటి రెండింటికి ఆధారాదేయ భావం వుంది
అవినాభావ సంబంధం వుంది
మన తలా, మెడా, మొండెమూ, కడుపూ, కళ్ళూ లాగా
పిల్లవేళ్ళూ, తల్లివేరూ, ప్రకాండమూ, కొమ్మలూ, రెమ్మలూ
వృక్షానికి అంగాలు, అందాలు, అభేద విభాగాలు.
కాని, ఈగుడిసెలు మేడలోని భాగాలు గావు
వాటికీ వీటికీ ఆధారాధేయ భావం లేదు
అవినాభావ సంబంధం లేదు
గుడిసెలు మాత్రమే మేడలకు ఆధారాలు, ఆహారాలు, అంతే !

# మారిన వేదం

## 1

"కర్మణ్యే వాధికార స్తే
మాఫలేషు కదాచన"
ఇది గీతా బోధన.
"పని చెయ్యడం మీవంతు
ఉత్పత్తులపై అధికారం మావంతు
ఇది పెత్తందార్ల వాదన
నాడూ నేడూ ఇదే ఆచరణ
అజ్ఞానం వల్ల నాడు లేదు ఏ బాధా
చైతన్యం వల్ల వచ్చింది, నేడు తగాదా
భూస్వామ్య ధన స్వామ్య ప్రతినిధి నాయకత్వం
తీరుస్తున్నది తూటాలతో తగాదా

## 2

"యత్ర నార్యస్తు పూజ్యంతే
తత్ర దేవతాః రమన్తే"
ఇది మను(మన)ధర్మశాస్త్రంలోని మాట
అదే చోట
స్త్రీని నీచాతినీచంగా
శిక్షించమన్నది అదేనోట

అదే ధర్మశాస్త్రం
అదే॰ ధర్మశాస్త్రం ??

తర్వాత నరసమాజం
మొదటి అర్థాన్ని వదిలి వేసింది నిజం
రెండవ భావంతో ఆడుకుంటున్నది నారీలోకంతో
అంతే! ఆడది (ఆటది) ఆటవస్తువై పోయింది.

ఆడపిల్లను దానం చేసే హీనస్థితికి,
అంతేగాదు ఆడదాన్ని అమ్మేస్థితికి
సొంతం దిగజారిపోయింది సమాజం

వస్తువును కొనుక్కున్నవాడు
వస్తువును లాగే అనుభవిస్తాడు
అంతేగాని
మనిషిలాగా గౌరవిస్తాడా ?

నే నాటవస్తువును గాదూ–అని తిరగబడితే
ఆమెదే తప్పంటుంది నరధర్మశాస్త్రం

కన్యా శుల్క కాలంలో అమ్ముడు పోయిన స్త్రీ స్థానం
వర విక్రయ వరకట్నాల కాలంలో
ఎంతో యెదిగిపోవలసివుంది
మరి, యేం జరిగింది ?
ఇంకా దిగజారిపోయింది

నాడేమో కన్యను కొన్న యజమాని ననుకొన్నాడు.
నేడేమో పురుష ప్రతిపత్తి పెరిగి
అంచెలంచెలుగా విలువ
ఆకాశాన్నంటిందంటున్నాడు

ఈనాడు జరుగుతున్న భ్రూణ హత్యలు
స్త్రీ హత్యలూ, ఆత్మ హత్యలూ
అవమానాలూ, మాన భంగాలూ
ఇంకా ఎన్నెన్నో
ఇవన్నీ గూడా
స్త్రీ తప్పు వల్లనే అంటున్నది నరసమాజం.
వారే వా నర సమాజం!
వారే వా నర సమాజం!

మొసలి కన్నీరు కారుస్తున్నది
నరస్వామ్య నాయకత్వం
స్త్రీ రూప నరస్వామ్య నాయకత్వం

## 3

"అన్నం పరబ్రహ్మస్వరూపం
అన్నం బహుకుర్వీత
అన్నం న నింద్యాత్
అన్నం న పరిచక్షీత"
ఇత్యుపనిషత్

అన్నదానం గొప్పదంటూనే
అందకుండా దాచుతున్నారు,
పరాన్న భుక్ వ్యాపారులు.
అంతకంతకూ ధరలు
త్రివిక్రమాక్రమంలో
ఆకాశాన్నంటి నక్షత్రాలై కూర్చున్నవి.
ఆహారాది పదార్థాలన్నీ నల్లబజార్ల

చీకట్ల కటకటాల్లో
కన్ను పొడుచుకున్నా
కానరాకుండా దాగిపోతున్నవి,
అయ్యో, అన్నోత్పత్తి కారకులే
అన్నమో రామచంద్రా అని
అటమటిస్తున్నారు.
దొంగ నాయకులు కుహనా కోపంతో
కళ్ల బెదిరింపుతో
"చూసుకో ఏం చేస్తామో అంటూ
చే సంజ్ఞలతో ఆ దొంగలకు అండగా
నిలబడ్డారు లంచాలు భోంచేస్తూ

## 4

"సత్యా న్న ప్రమదితవ్యం
మా హింస్యాత్ సర్వాని భూతాని"
ఇత్యుపనిషత్
సత్యానికి ప్రమాదం రానీకండి
ఏ ప్రాణినీ హింసించకండి
ఇదీ దాని మతలబు
సత్యము, అహింసా
ఒకే నాణేనికి బొమ్మా బొరుసులు
ఆనాడు గూడా వాటిని కేవలం
సాహితీ పదాలు గానే చూశారు
నేడంటారా! ఇంకా విడ్డూరం
ఆచరణాత్మకంగా
సత్యాన్నీ అహింసనూ
గాంధీనీ కట్టగట్టి తగుల బెట్టారు.



# బుద్ధిజీవి

నేను బుద్ధిజీవిని
ఏనాడు గూడా
బుద్ధిజీవులు శరీరకష్టం చెయ్యరనీ
ఉత్పత్తి కార్యక్రమాల్లో పాల్గొనరనీ
ఉపాయాలు మాత్రం అన్వేషిస్తూ వుంటారనీ
అనుభవంతో తెలుసుకున్నాను.

చదువు రావడం యెంత మేలయింది
ఇపుడు నేను శరీర కష్టం చెయ్యను
ఎన్నో శతాబ్దాల క్రితం
కీకారణ్యాల్లో
కొండల్లో, కోనల్లో,
మృగాలతో పాటు జీవించే రోజుల్లో
అల్పమృగాల వేటాడి చంపి
పచ్చిమాంసాన్నే భక్షించే రోజుల్లో
ఆకులూ అలుములూ మొలకు చుట్టుకొని
మానం మాత్రం కప్పుకొంటూండిన రోజుల్లో
స్వార్థం లేనివాణ్ణి,
స్వార్థసుఖ మెరుగని వాణ్ణి.
అగ్నిని కనిపెట్టాను
మేకలనూ, గోవులనూ

పంచనఖ ప్రాణులనూ
కాల్చుకొని తినడం నేర్చాను
అగ్నిని ఆరిపోనీకుండా
నిత్యాగ్నిహోత్రాలను సృష్టించాను.
గ్రామ జీవితానికీ
వ్యవసాయానికీ
శ్రీకారం చుట్టాను.
కొన్ని శతాబ్దాల పర్యంతం
కాడీ మేడీ పట్టుకొని
పొలాల దున్నినవాణ్ణే
ఎరువులూ బరువులూ మోసి
మోటా యేతామూ, తొక్కి
పంటలు పండించిన వాణ్ణే
చదువు రావడం యెంత మేలయింది!
చదువులు సొంతం చేసుకోడం ఎంత మేలయింది!
చదువు దెబ్బతో శరీర కష్టం మానేశాను
ఇపుడు ఆ జోలికే పోను
ఉత్పత్తులు తగ్గి
కూడూ, గూడూ, గుడ్డా కరవైనా
సరుకులు దాచి ధరలు పెంచేసినా
దానికి మద్దతు నిచ్చే కొద్దిమంది నా వాళ్ళూ, నేనూ
చదువులు మాత్రం సాగిస్తూనే వున్నాము
ప్లాన్లు వేస్తూనే వున్నాము
మంచి ఆహారమూ, మంచి వస్త్రమూ
మంచి నివాసమూ

లోటు లేకుండా చేసుకుంటూనే వస్తున్నాము
ఈనాడు నా ఆహారం
ఆహార్యం, ఆవాసం
చాలా నాజూకైనవి
నూరు సామాన్య కుటుంబాల అనుభవానికి దీటైనవి.
చదువు రావడం యెంత మేలైంది !
అయితే అసూయాపరులు కొందరు
శరీరకష్టాన్ని వదిలేసి
మాలాగా సుఖ జీవనం పొందాలని
యిటు మారడానికి ప్రయత్నించక పోలేదు
వాళ్ళ ఆట కట్టించాను
పరిపాలకులను నా గుప్పెట్లో పెట్టుకొని
మనం ఉభయులమూ, ఆరోగ్యంతో ఐశ్వర్యంతో
జీవించాలంటే
వాళ్ళకు
నిత్యం చాకిరీ చేసే వాళ్ళకు
వాళ్ళకూ, ఆడవాళ్ళకూ
విద్యా నిషేధం కావాలన్నాను
నా శిష్యః పృథివీపతులు – మీరు
మీ మాట జవదాటితే
కఠినాతికఠిన శిక్షలకు
గురి చెయ్యాల్సిందే
అంతేమరి !
అందరూ అందలమెక్కితే మోసే వాడెవడండీ !

ఈ దెబ్బతో
శ్రమ జీవులంతా -
మనకు ఆహారాన్నీ సేవలనూ
జన్మతః, అందించేవారంతా
చదువు లేకుండాపోయారు
కొట్టాకుండా, తిట్టాకుండా - అన్నట్లు
సమాజమంతా మొద్దుబారిపోయింది

ఎదురు దెబ్బ తిని మేల్కొన్నట్లు
నేను మరికొంత చైతన్యం పొందాను
ఆలోచించాను
బుద్ధికి పదును పెట్టాను
వాళ్ళలోని చైతన్యం
ఇంక పునరావృతం కాకూడదనుకున్నాను.
చదువురాని వాళ్ళే
చదువు వచ్చిన వాళ్ళే - కూడా
మత్తులో పడెయ్యాలనుకున్నాను
దేవుణ్ణి సృష్టించాను
నేను దేవుణ్ణి సృష్టించాను
వెంటనే
కర్మ సిద్ధాంతాన్ని గూడా సృష్టించాను.
లాభం, లోభం, భయం, భక్తి
నూరిపోశాను.
దేవుణ్ణే నమ్ముకోమన్నాను
నమ్మి మోసపోతే - అది - నీ కర్మే అన్నాను.

ఈ దెబ్బతో
ఇంకా మొద్దుబారిపోయింది సమాజం
దేవుడు నా ఆలోచనా సారం
కర్మసిద్ధాంతం నా మేధాసారం
ఈ నాడింకా తెలివి మీరిపోతున్నది సమాజం
ఇది నాకేనాడో తెలుసు
ఆనాడే తీవ్రంగా ఆలోచించక పోలేదు
ఈనాడు మరొకసారి
నా మేధకు పదును పెట్టాను
కులమతాల సృష్టించాను
ఈ మట్టి సమాజాన్ని
నిలువుకూ, అడ్డానికీ, నరికి
ముక్కలుగా నలుసులుగా, కుంది
ఎడపెడగా విసిరి పారేశాను
వెంటనే అస్పృశ్యత గూడా సృష్టించాను
సమైక్యభావమూ, సమానతా జ్ఞానమూ
మందుకు గూడా లేకుండా చేసేశాను
కట్టుకథలూ, నీతి సూత్రాలూ - అల్లి
హెచ్చు తక్కువలూ, దైవ భీతీ, వ్యాప్తిపొందించాను
అన్నీ దేవుడే చేశాడనీ
దేవుడు గూడా కర్మాధీనుడనీ
ప్రచారం చేశాను నమ్మించాను
కాలం మారుతున్నది
మానవులు తెలివి మీరిపోతున్నారు

పాలకు లేనాడో పోయారు
ప్రజలు మరీ తెలివి మీరిపోయారు
నిజం చెప్పొద్దూ
నాకు నిజంగా భయం వేసింది.
ఈ, యాదవ కులానికి ముసలం పుట్టించాలనుకున్నాను.
కసి తీర్చుకోవాలనుకున్నాను.
సరికొత్త అస్త్రాన్ని కనిపెట్టాను.
అదే! వోటు - వోటు, వోటు
ఎన్నో కోట్ల విలువచేసే నోటు
దాని మహిమతో
ఉన్న విభేదాలకు తోడుగా
కులభేదాలూ, మతభేదాలూ
భాషాభేదాలూ, ప్రాంతీయ భేదాలూ
ఒకటేమిటి - ఎన్నింటినో
పెట్రోలు మంటల్లాగా
ప్రజ్వలింప జేశాను.
భౌతిక రసాయన భూగోళ శాస్త్రాలు
ఎంతముందుకైనా పోనీ
ఇంకెన్ని చిత్ర విచిత్ర ఆవిష్కరణలు జరగనీ
నేను విత్తి, పెంచిన, ఈ, కుల మత చీకటి వృక్షం
విశ్వాంతరాంతరాల నిండా
వ్యాకోచించుకొని ప్రాకుతున్నదే - తప్ప
ఇక సంకోచానికి తావే లేదు
నా మేధా, నా ఆలోచన

అణోరణీయాన్ - మహతో మహీయాన్
త్వమేవాహం, గిమేవాహం - యేమీలేదు
తత్త్వమసి - బూడిదమసి - యేమీలేదు
అవన్నీ - అందరినోళ్ళు మూయడానికి నేను సృష్టించిన పదాలు
అహం బ్రహ్మాస్మి, అహం బ్రహ్మాస్మి
అహమేవ బ్రహ్మాస్మి
ఎంతకాలం - సొంత ఆస్తులకోసం
ధనదాహం, కీర్తిదాహం - వుంటాయో
అంతకాలం
నేను నిత్యం
నేను సత్యం
అహం బ్రహ్మాస్మి
నేను బ్రహ్మను
నేను బుద్ధిజీవిని -
మేధావిని



# దోపిడి

స్వరాజ్యం వచ్చి
సరిగ్గా ముప్పయి అయివేడ్లు
రేపే దుందుభి ఉగాది

రేపల్లిలో బి. ఏ. చదువుతున్న
రెండో అబ్బాయి గూడా వచ్చాడు
రాత్రి తొమ్మిదయింది.
తిప్పారావు పడుకోబోతున్నాడు

రైతు పెద్ద సుబ్బారావు
తప్పతాగి తిట్టుకూతలు కూస్తూ
తిప్పారా వింటిపైకి దండెత్తాడు

ఒరేయ్ తిప్పా
నా బట్టలకంతా రంగులు పూసుకొచ్చావు
ఉగాదికేం వేసుకోమంటావు

పొరపాటు జరిగింది బాబూ
తొందరపాటులో రంగుబట్టలతో కలిపాను
రేపు బాగా ఉదికి పెడతాను
తిప్పారావు ప్రతిమాలాడాడు

ఉత్తి పుణ్యానికి రెచ్చిపోయి
దుర్భాషలాడుతున్న పెద్ద మనిషితో
రెండో అబ్బాయి తలపడ్డాడు

మాటలు జాగ్రత్తగా రానీ
మా యెదటే మా నాన్నను
తిప్పాగిప్పా అంటావా ? అని
నిగ్గదీశాడు
అంతేగాదు కొంత సేపు
నిశ్చేష్టుడుగా నిలబడ్డ సుబ్బారావు నుద్దేశించి
నీ కులం జులుం వదిలిస్తా నన్నాడు

సుబ్బారావు మైకంలో వున్నాడు
అటూ యిటూ మొగం విసిరి
అవ్వన్నా, నిన్నూ నీ తాతనూ అంట్రానా
పట్నానికెళ్ళి రెండింగ్లీషు ముక్కలు
ముక్కున పట్టగానే నీ కులం పోయిందట్రా
పెద్దా చిన్నా గొప్పా కొంచెము లేదట్రా

ముట్టుబట్ట లుదికి
మేం యిదిలించిన మెతుకులు తినేవాళ్ళకు
ఇంత పొగర్రా

ఇంక నోరెత్తావంటే
నోట్లో ఒక్క పన్ను లేకుండా
రాలగొట్టేస్తాను - అన్నాడు

ఇదంతా యిప్పుడు జరిగింది
కాని
యింతకుముందే నిర్ణయించుకొన్నారు
యీ వూళ్ళోనుండి వెళ్ళిపోవాలనీ
పట్నంలో లాండ్రీ పెట్టి

పట్టణ రజకుల్లాగా
పరువుగా బ్రదకాలనీ
మూటాముల్లే సద్దుకున్నారు

ఇరవై యేళ్ళ క్రితం
పోలీసుగా చేరిన తన పెద్దన్న
సబ్బినస్పెక్టర్ యినాడు.
ఈ వూరికి వచ్చిన నాడు
ఈ పెద్ద కులాల వాళ్ళే
పెద్ద పీట వేసి
మర్యాదలు చేసేవారు
ఇప్పటికీ చేస్తారు
భయ భక్తులతో
నమస్కారాలు చేస్తారు
కుల మిప్పుడెక్కడుందిలే అంటారు
తన చిన్నన్న యిరవై యేండ్లనాడు
గుంటూరులో లాండ్రీ పెట్టాడు
తాగుడు జోలికి పోడు
రెండు పెద్ద మేడలు కట్టాడు
పిల్లల్ని చదివించుకున్నాడు
ఈనాడు
రజక సంఘంలో పెద్దవాడు
రాజకీయాల్లో పలుకుబడి గలవాడు.

అయిదేళ్ళ క్రితం తన
అయిదో అన్న గూడా

గౌరవంగా బ్రదకడం కోసం
వూరు విడిచి పోతూవుంటే
ఈ రైతులంతా
నానా తిట్లూ తిట్టి
నానా హంగామా చేశారు

పోవడానికి వీలు లేదన్నారు
తరతరాల ఒప్పందంతో
వారసత్వంతో, ఉద్యోగం చేసే మీరు పోతే
మా బట్ట లుదికే దెవ్వరు
బయటికి అడుగుపెట్టారా
కాళ్ళిరగగొట్టి మూల కూర్చోబెడతాం అన్నారు
ఆఖరికి అతడు
దూరంగా పారిపోయాడనుకోండి

ఇదంతా తిప్పారావు మెదడులో
తిరుగుళ్ళు తిరుగుతూ
గాభరా పుట్టిస్తుండగా
సుబ్బారావు గావుకేకలకు
మరికొందరు చేరారు

వూరు వదిలి పోతామని
మరెప్పుడన్నా అన్నారంటే
అసలు మనసులో అనుకున్నా సరే
మక్కెలిరగదన్ని
మూల కూర్చోబెడతాం అన్నారు

పది గంటలు దాటింది
సద్దుమణిగింది
అందరూ పడుకున్నారు
తిప్పారావుకు ఒకే ఆలోచనలు
రేపెట్లాగయినా చీకట్లో
పిళ్ళు చూడకుండా
పట్నం పారిపోవాలని
తెగని ఆలోచనల్లో పడ్డాడు

తెల్లవారు ఝామున
ఉదటుగా మేల్కొన్నాడు
తనను తన మంచానికి
తాళ్ళతో కట్టేసి వున్నారు

శరీరమంతా చెమట పట్టింది
అమ్మో
ఇదంతా కల అనుకున్నాడు

ఇటూ అటూ చూశాడు
అది కలగాదు
కట్టిన సామాన్లమూటలు
ఎట్ట ఎదురుగానే వున్నాయి
తన కొడుకులనూ
భార్యనూ
గుంజలకు కట్టేసి వున్నారు

అంతటి వచన కవితలూ

కల గాదిది
పచ్చి నిజం
రజకులు వెళ్ళిపోతే
మా బట్ట లుదికే దెవ్వరా అంటూ
వికటాట్టహాసం చేస్తున్నారు
సుబ్బారావూ, మిగిలినవారూ



# రక్తంలో నుండి రక్తాక్షి

తెల్లవారితే ఉగాది
తెల్లవారుతున్నది
మెలకువ వస్తున్నది
చెట్లల్లో వుండి మెల్లగా
కుహు కుహూ అంటున్నది రక్తాక్షి కోకిల
మట్టి క్రింది ఒక గుడిసెలో నుండి
బయటికి వచ్చాడు బడుగుజీవి

కషాయ నేత్రంతో చూస్తూ
కషాయ కంఠంతో కూస్తూ
కనబడింది కోయిల

ఒక్క క్షణం కుతూహలం రేకెత్తి
కుహుకుహూ అన్నాడు బడుగువాడు
ఎవరన్నా చూస్తున్నారేమో అని
చుట్టూరా చూచుకున్నాడు
తనకు తనకే సిగ్గువేసింది
తన్ను చూచి తిరస్కార ధోరణిలో
ఎగిరిపోయింది కోకిల

దానికెంత తిరస్కారం! ఎంత స్వాతంత్ర్యం!
దానికి ఎప్పుడు, ఎంత కావాలనుకుంటే
అప్పుడే అక్కడే ఆహారం
ఎంత శ్రమిస్తే అంత ఆహారం

మరి యీ బడుగు జీవి ! !
తాను నిత్యమూ శ్రమిస్తున్నాడు
శ్రమ ఫలం తన ఆధీనంలో లేదు

తెల్లవారితే ఉగాది
తెల్లవారుతున్నది

గుభిల్లుమన్నాయి బడుగుజీవి గుండెలు
గొల్లుమని కేకలు
బిలబిలా వచ్చారు రాముడూ శాంతీ
సరస్వతీ, కృష్ణ, గోపెమ్మా
నాన్నా యేదీ చొక్కా, యేదీ చెడ్డీ
యేదీ గౌను ఏదీ పావడ అంటూ

పంచ సంతానాన్ని చూచి
పంచప్రాణాలు ఎగిరిపోయాయి బడుగు జీవికి
ప్రతి ఉగాది కి యింతే

ఇప్పటికి నలభై ఉగాదులు చూశాడు
చిన్నప్పుడొక ఉగాదినాడు తానూ మారాం చేశాడు
అప్పుడు తన తాతకు అరవై యేళ్లుంటాయి
నాన్నకు ముప్పయి అయిదు
తనకు పదేండ్లు

అప్పుడూ యిదే గుడిసే
ఇదే కాదులే - దీని తాత గుడిసె
ఇదే కోయిలే -
ఇదే కాదు - దీని ముమ్మత్తాత కోయిల
దానికీ దాని సంతానానికీ, ఆ తర్వాతి సంతానానికీ

ఇంతవరకూ గూడా అదే స్వేచ్ఛ
అదే స్వేచ్ఛాహారం, అదే ఆనందరాగం

ఆనాడు - తాను మారాం చేసిననాడు
తన తాత ఊఅడించాడు.
ఇంకా మారాం చేశాడు
తండ్రి ఒకతాపు తన్నాడు
ఆ వారసత్వమే తనకు సంక్రమించింది
నిన్నరాత్రే యిద్దరు పిల్లల్ని బాదాడు

తెల్లవారితే ఉగాది
తెల్లవారుతున్నది

పల్లెటూళ్ళో బదుకు సాగక
సిటీ కొచ్చాడు తన తాత
అక్కడే వుండిపోయిన తన వాళ్ళు
ఇక్కడ - యీనాటి తామూ - అదే బడుగు జీవితం

దారిద్ర్యం పెరిగిపోయింది
ధరలూ పెరిగిపోతున్నాయి
కారులూ, మేడలూ, ఫ్యాక్టరీలూ
చదువులూ, ఉద్యోగాలూ, మోసాలూ
అహం అహం అంటూ
లంచాలూ, దోపిడీలూ, పెరుగుతూనే వున్నాయి
బడుగుతనం మాత్రం!
పోటీగా అదీ పెరుగుతూనే వుంది

తెల్లవారితే ఉగాది
తెల్లవారుతున్నది

ఎదురుగా పిల్లలు దీనంగా నిలబడ్డారు
ఎదిరింటి మేడలో పిల్లలు
అప్పటికే శిరస్నానాలు చేసి
కొత్తబట్టల మర్మరధ్వనులతో
అటూ యిటూ తిరగడం ఈ పిల్లలు చూస్తూనే వున్నారు
వీళ్ళ కళ్ళల్లో ఈర్ష్య, అమాయకత, జాలి
దీనతా నిస్సహాయతా తొణికిసలాడుతున్నాయి

అందరికంటే చిన్నపిల్ల గోపమ్మ
కాస్త ధైర్యంచేసి, నాన్నా, గౌను అన్నది
బడుగువాడి గుండె బరువెక్కింది
హృదయం క్షుభితమైంది
కన్ను లెరుపెక్కి రక్తాశ్రువుల చిమ్మినయ్
గిరుక్కున తల తిప్పి
పక్కగుడిసెల వైపు పరుగెత్తాడు
వారే రామన్నా, కిష్టన్నా
బలరాముడూ బయటికి రండర్రా అన్నాడు
వాళ్ళ మొగాలు గూడా యిదే మాదిరి వున్నాయ్
నిర్ణయానికి రమ్మని నిన్నరాత్రి చెప్పాను-ఏం చేశారు-అన్నాడు
ఎంతకాలం యెదురు చూచినా మన బ్రదుకింతే అన్నాడు
వాళ్ళూ ఉడికి పోతున్నారు ఉద్రేక పడుతున్నారు
కళ్ళు రక్తాన్ని చిమ్ముతున్నాయి. అగ్గి కక్కుతున్నాయి
పిడికిలి బిగించారు
అంతులేని యీ బడుగు జీవితాలకు
కారకులెవ్వరు ?

ఈ దురంత దురాక్రమణలకు
కారకులెవ్వరు ?
పదండి ముందుకు అన్నారు

ఒక్క పనుగులో గుడిసెలోకి దూరి
ఎర్రజండా అందుకున్నాడు బసుగువాడు
అందరిముందూ నిలబడ్డాడు
పదండి ముందుకు అన్నాడు
అందరూ సుత్తులూ కొడవళ్ళు అందుకున్నారు
తెల్లవారితే ఉగాది
తెల్లవారిపోయింది
రుధిరోద్గారి కడుపులో నుండి
రక్తాక్షి ఉగాది అభ్యుదితమైంది



# నరకవధ

తండోపతండాలుగా పిండివంటలు మీకు
పండగనాడు కూడా తండులాలు నిండుకున్నాయి మాకు
కడుపులకు మెక్కగా మిగిలినదాన్నంతా
మాకందకుండా దాచి తగలబెడుతున్నారు
కడుపు కింత తిండిగూడా లేక
కడుపులు తగలబడుతున్నాయి మాకు
కుడిచి, కట్టి మీతోపాటు
తగలేస్తున్నారు టపాకాయలు మీ పిల్లలు
మమ్మల్ని వేధించీ విసిగించీ మొట్టికాయలుతింటూ
మీ పిల్లల ఆటలను జాలిగా చూస్తూ
నిలబడ్డారు దిగులుగా మాపిల్లలు
నిజంగా బాంబూ టపాకాయలచేతా
తారాజువ్వల చేతా
కాసురుళ్లు చచ్చేటట్లయితే
ను గూడా వధించాలని వుంది నిజమైన నరకాసురుళ్లను
ందుకు మేము
ఆ టపాకాయ బాంబులనూ, తారాజువ్వలనూ
ఇదో ఇప్పుడే హస్తగతం చేసుకుంటాం బలవంతంగానైనా



# అవ్యయకృషి

చీకట్లు అనంతాలు, అవ్యయాలు
సర్వాంతర్యాములు
వాటిని తూర్పు నుండి పడమరకూ
పడమర నుండి తూర్పుకూ
నిరంతరం నిస్వార్థంగా
దశదిశలా తరుముతూనే వుంటారు

ప్రభాకరుడు, సూర్యుడు
ఈ సూర్యుడు ఒక్క రవ్వంత నక్షత్రం

*　　　*　　　*

ఇలాంటి సూర్యగోళాలు
ఎన్నయితే-ఒక పెద్ద నక్షత్రం !!
ఇలాంటి పెద్ద పెద్ద నక్షత్రాలు
ఎన్నయితే ఒక నక్షత్ర మండలం !!
ఇలాంటి నక్షత్ర మండలాలు
ఎన్నయితే ఒక గెలక్సీ !!
ఎన్ని - గెలక్సీలయితే ఒక నెబ్యులా
అబ్బో !

ఇంత సూర్యుడు గూడ
వాటితో పోలిస్తే
కంటికి కనిపించనంత నలుసు
ఇంత విశ్వంతో పోలిస్తే
వెలుతురులో సైతం
భూతద్దానికి గూడా దొరక నంత
అల్పాణువు అల్పజీవి ఈ మానవుడు
ఈ అణోరణీయాన్
అతి స్వార్థంతో ఎంత విర్రవీగుతున్నాడు !



# రక్తాక్షి క్రోధనలం

నిర్దయకుక్షి రక్తాక్షి
పలాయనం చిత్తగిస్తున్నావా
కసినంతా ప్రదర్శించావు
పారదోల బడి పారిపోతున్నావు

మదమహిష బుద్ధిని
పోనిచ్చుకున్నావు గావు
ఉర్వరాన్నంతా ఖుర ఘట్టనం చేసి
పాషాణ విషాణ భేదనోక్షిప్తం గావించావు

విచక్షణా జ్ఞాన రహిత మహిషమా !
అధర్మ ధర్మరాజు నెక్కించుకొని
అబలా నహంతవ్యా అన్న ధర్మాన్నే వదిలేశావు
ఇందిరాగాంధీ రక్తాన్నే ఆచూషించావు
ఆంధ్రలో మాత్రం
అంతకు తక్కువేమీ చెయ్యలేదు
అమెరికా వరకూ పయనం గట్టావు
చదలూ సముద్రాలూ ఈదలేక
చదికిల బడ్డావు
క్రూర రక్తాక్షాలతో వీక్షించావు
మరణ మంతపని జరిగింది
నాయకుడికి పునర్జన్మ గలిగింది
నీకు ఓటమి సంభవించింది

అక్కడా ఇక్కడా అక్కడక్కడా
నీ మహిష మస్తిష్కాన్ని ప్రదర్శించి
పండగల్లో, ఎన్నికల్లో
మత విద్వేషాల రగిలించి
నీ పబ్బం గడుపుకున్నావు

ఎంత రక్తపాతం!
ఎంత మానధన నష్టం!
సాటివాణ్ణి సాటివాడే
తెలిసినవాణ్ణి తెలిసినవాడే
చంపుకోడం, ఎంత కిరాతకం!

అవి గణేశఉత్సవాలు కావచ్చు
పీర్ల పండగ బకిరీదు పండగలు కావచ్చు
విచ్చు కత్తులతో వీరవిహారం చేశారు
మత మహమ్మారి దురంత దురహంకార
దుర్మేధాజనితద్వేషానల వికటాట్టహాస హేషలతో
వీర విహారం చేశారు
పరస్పర మారణహోమం జరుపుకున్నారు

హైదరాబాదు, అహమ్మదాబాదు
బొంబాయి కాశ్మీర్, ఢిల్లీ
ఒకటేమిటి
ఎన్నెన్నో మృత్యుహేలాలీలా వికటాట్టహాస విన్యాస
ప్రదేశాలు
అంతకంటే ఘోరాలు పంజాబు దురంతాలు

ఆనాటి జలియన్‌వాలాబాగ్ దురంతాల కంటే
ఈనాటి అమృతసర్ దురంతాలు అహీనమైనవి
ఒక్క ముఖ్య భేదం వున్నది
ఆనాడు తెల్లదొరలు పంజాబీలను హతమార్చారు
ఈనాడు పంజాబీలే పంజాబీలను ప్రేల్చుతున్నారు

వన మహిషరూప రక్తాక్షీ
నీవు ఒక్క సంవత్సరం బాధించిపోతున్నావు
పోతూ పోతూ
రాచపీనుగ ఒంటరిగా పోదన్నట్లు
మరొక బీభత్సాన్ని సృష్టించి
చాలామంది ప్రాణాలను వెంటగొని పోతున్నావు

దుర్వ్యవస్థిత కులవ్యవస్థా జనిత
దుష్టోరగ దష్ట బాధా నివారణార్థం
ప్రథమ చికిత్సలాంటిది,
రిజర్వేషన్ విధానం
షష్టిపూర్తి చేసుకున్న రేషన్ విధానం.
అసమర్థ స్వార్థ పరిపాలకుల
కులస్వామ్య ధనస్వామ్య పరిపాలనలో
శాశ్వత పరిష్కారాన్ని పొందించే
ఆపరేషన్‌కు సొంతం నోచుకోలేని స్థితుల్లో
అప్పదప్పుడూ సెలవే సేపుండు
ఈ రిజర్వేషన్

ఓ రక్తాక్షీ, నీవు దుర్మతికి రుధిరోద్గారికి
వారసుడవు

అందుకే పోతూ పోతూ
రిజర్వేషన్ రేషన్ అర్థం తెలియని -
పరిపాలకుల అంతర్యాన్ని పసికట్టని
అజ్ఞాన అవివేక ఉద్రేక
యువకులను రెచ్చగొట్టి
ఎందరో దానయ్యలను తోడుగా తీసుకొనిపోతున్నావు
పో పో

*        *        *

క్రోధనా, రా
అంతా విన్నావు గదా !
నీవు స్త్రీ లింగమవో, పుంలింగమవో
ఉభయ లింగివో యెవరయితేనేం
నీ పేరు నేతి బీరకాయ కావాలని చేసుకోకు.
క్రోధనుడా నీవు విజృంభించు
కులస్వామ్య ధనస్వామ్య పదవీ స్వాములను
పరాన్న భుగ్గోముఖవ్యాఘ్రాలనూ
పయోముఖ విషకుంభాలనూ
రాష్ట్ర కంట్రాక్టర్లనూ
రికి పత్తాసుగా వున్న ఉద్యోగులనూ
మంత్రదాసుల ఘర్మజలం రూప రక్తాన్ని
మాపాయల క్రింద మార్చుకొనే కిరాత నియంతలనూ
బియ్యంలో ధాన్యంలో
గ్రేడు వారీ గులకరాళ్ళను కలిపే జాతి ద్రోహులనూ
ప్రాణ రక్షకైన మందుల్లో కల్తీలు చేసే

## రక్తాక్షి క్రోధనలు

సర్వవిధ సంఘద్రోహులనూ
నీపాద ఘరట్ట ఘట్టనల చేత
రాచి వేయవా ?
అమ్మా క్రోధనా !
మాతృస్వామ్య వ్యవస్థా దినాల్లో
నీవే సబలవు ఆది శక్తివి
ఆనాటి నీ మాటకు ఎదురాట లేదు
కొమ్ములు తిరిగిన మగళ్ళు సైతం
ఏ కుమ్ముకు భయపడి
కుక్కిన పేనుల్లాగా వుండేవారు

ఈ నాడంటావా !
అంతా అబలలే
బలాత్కాంతలే
సర్వవిధాలా వంచితలే

ఆడదిగా పుట్టడమే మహాపాపంగా
భావించిన ఇంతకు ముందటి రోజుల్లో కంటే
ఆడదిగా జీవించడమే
అపాయంగా హీనంగా మారాయి యీ రోజులు
కులవ్యవస్థా దుష్టఫల చతుష్టయం
అనేకత, అవిద్య, అస్పృశ్యత స్త్రీ బానిసత్వం
నీ విజృంభణ అత్యవసరం ఈనాడు
నీ క్రోధానల కీలా విజృంభణతో
సమాజ పాపదహనం ఆద్యావధి గావాలి
ఓ క్రోధనా ! నీవు ఉభయలింగివా ?

అయితే అర్ధనారీశ్వరుడివే
త్రినేత్రుడివే
సర్వవిధ స్వార్థ వంచనా పరత్వాన్నీ
జనధన పాపోల్బణాలనీ
మతమూర్ఖ ఆత్మహననా అజ్ఞానాన్నీ
అణగద్రొక్క
మామూలు మాటలకూ మంత్రాలకూ
చింతకాయలు రాలవు
వికటాట్టహాస విన్యాసంతో విజృంభించు
ముక్కంటి మంటలచే దహించు



# కాకః కాకః - పికః పికః

గుడ్డేమో తెల్లగుడ్డు
పొదిగిందేమో కాకము
ఇంద్రజాలమా యిదేమి!
కాకి-పిల్లగా దిదేమి!

పెరుగునట్టి పరిసరాల
ప్రాబల్యం తప్పదంద్రు
కాకి పొదిగినట్టి, పిల్ల
కలనాదం - అపవాదం

ఎంగిలి మెతుకులకోసం
ఎంతెంత సుదూరమైన
కాకా కాకా అని పరు
గెత్తే కాకమ్మ కాదు

సురభి ప్రత్యూషవేళ
సద్యో వికసితపరిమళ
సుమగంధా ఘ్రాణానం
దోత్కంఠ స్వాంత అది

చూతాంకురఘస్మరతో
న్మత్త కంఠ జనిత జన
శ్రవణానందకరమ్మగు
కుహూ నాదకోకిల మది

సవర్ణులే అవి రెండూ
కులములు వేరే రెండూ

చూపులలో ఆకర్షణ
సున్న అదే ఏకాక్షికి
అనురక్తాకర్షశక్తి
మిన్న అదే రక్తాక్షికి.

మోర యెత్తి గళం విప్పి
ఎంత గొంతు చించుకున్నా
కాకి లావుగొంతు అరుపు
తారస్థాయికి పెరగదు.

సుశ్రావ్యాక్షరరూపమగు
తెలుగుపాట దానినోట
అపశబ్దం అపహాసన
జన్మరాగమైన పాట

పరభృతముల గూటినుండి
పరభృత కోకిలము వచ్చె
అయినా కాకము కాకే
కోయిలమ్మ కోకిలయే.

# వినాయకులు

ఏడాది కొకనాడు
ఎందరో పెట్టిన ఉండ్రాళ్లను
మక్కువతో బొజ్జ పగిలేలా
మెక్కే వినాయకుడు
ఒక్కడే ఆనాడు

నిత్యం యెంత దొంగ గడ్డి మేసినా
బొజ్జలే నిండని వినాయకులు
లంబోదర గజాననులు
అగణ్య విఘ్ననాయకులు
అంతటా ఈనాడు



# మా భాగం మాకు

తిట్టుకోర్చి కొట్టుకోర్చి
నిస్వార్థపు చెమటనోడ్చి
అందరికి సరిపోయే
ఉత్పత్తుల కూర్చినాము.

అనుభవించు మా హక్కును
దురాక్రమణ చేసినారు
అర్ధ కడుపు కూలిగొట్టి
మీ గాదెల నింపినారు.

జన్మభేద భావంతో
మీరు చేయ గాని పనులు
పరాన్నభుక్ సుకుమారులు
మీరు చేయలేని పనులు

అజ్ఞాన సముద్రులమై
సమతా స్పృహలేని మేము
నీచమైన బరువు పనులు
తరతరాలు చేసినాము.

కోట్ల విలువ చేసే మా
వోట్లను గుంజేసినారు
మెట్లనెక్కి గద్దెలెక్కి
పాతాళం త్రొక్కినారు.

మీ కూటికి మీ గడ్డకు
కారకులం మేము మేము
మీ అధికారమదానికి
కారకులం మేము మేము.

ఇక మీదట ఉత్పత్తుల
కార్యక్రమ కష్టంలో
చెరీ సగం
అనుభవించు హక్కుగూడ
చెరీసగం

మూర్ఖత్వం వదిలిపెట్టి
కుటిలత్వం కట్టిపెట్టి
ప్రతీకార విప్లవాగ్ని
ప్రజ్వరిల్లు మున్ముందే
(ప్రజ్వరిల్లకుండానే)

కనులు తెరిచి మనసు మార్చి
మనగలరా బ్రదుకు గలరు
లేదా ముక్కంటి కంట
మంటలలో మాడగలరు

కాదంటే మామూడవ
కంటిమంట మాడగలరు
కాదంటే మా మూడవ
కంటిమంట కాలగలరు



# మంచి బ్రదకండి

సమరోత్సాహాన
శ్రమకోర్చి చెమటోడ్చి
పరుగులిడి ఆశతో
ప్రాజెక్టు కట్టాము

నీరు మా భూములకై
పారి నట్లని తలచి
అన్నమే అన్నమని
ఆనంద మందాము

ఏమైన దా పంట
యింతైన మానోటి
వరకు రాకుండానె
మాయమవుతున్నాది

ఒంటిమేడలు ఎన్నో
మింటి కెగబ్రాకాయి
మాగుడిసెలే మాకు
భారమవుతున్నాయి.

అంతకంతకు మాకు
అర్థమవుతున్నాది
మంచిగా పంచుతా
రం చెదురు చూశాము

ప్రభవ విభవల చూచి
బహుధాన్యవఱ కాగి
శుభకృత్తుతో గూడ
శోభకృతువఱ కాగి

క్రోధి రాగానె మా
క్రోధాగ్ని చెలరేగ
విశ్వాస రహిత వి
ద్వేషుల హతమార్చగా

వ్యాఘ్రీభుజంగ హ
ర్యక్ష సదృశ రౌద్ర
మూర్తులై రక్తాక్ష
కాలురై రేగాము

దుర్ధర్ష వీరులము
దుర్నిరీక్ష్యులమగుచు
విజృంభణోద్రేక
విహరణము చేశాము

ఇటుచూడు అటుచూడు
ఎటుచూడు ఆచోట
రుధిర ఉద్గారాలు
రుధిర ఉద్వాంతాలు

అటుచూడు అటుచూడు
అరుణారుణోర్వీత
లారుణచ్ఛటలతో

ఉదయ సంధ్యారాగ
ముదయించె నదె చూడు

ప్రభవ సమతాశాంత
విభవ మందెను చూడు
సమసమాజ ప్రజో
త్పత్తి జరిగెను చూడు.

అన్ని రాష్ట్రములలో
అగ్రగామిగ నిలిచి
ప్రగతి సాధించాము మనమూ
మన జాతి
ప్రగతి సాధించామూ మనమూ

ప్రజాజీవనము నిలుప
నది జీవనము నిలిపి
కట్టించినారు ప్రాజెక్టూ
మనవారు
వెచ్చించి కోటానకోట్లూ

దీన హరిగిరిజనుల
పాలి దేవతలగుచు
కట్టించినారు భవనాలూ
ఎన్నెన్నో
వెచ్చించి కోటానకోట్లూ

గిరిజన గ్రామాల
హరిజన గ్రామాల
చేశారు విద్యాలయాలూ - అవి నేడు
జాతి విద్యుత్ప్రకాశాలూ

సంగీతనృత్యాలు
శిల్పవిన్యాసాలు
దర్శించినారు మనవారూ
అవి తెనుగు
సంస్కృతికి మారురూపాలూ



# పరాన్నభుక్ చాతకాలు

ప్రభవాదిగా చూస్తున్నాను
అప్పటినుండీ ప్రభవిస్తున్న స్వేదజలానికి
ప్రతిఫలంగా విభవం వర్షిస్తుందని
ఎగజూస్తూనేవున్నాను
కాని
పరాన్నభుక్ చాతకాలు
పైపైన్నే భక్షిస్తున్నాయి ప్రతి చినుకునూ
ఉద్దేశపూర్వకంగా జార్చిన
ఒకటీ రెండూ యెంగిలి చినుకులను మాత్రమే
యెంగిలిపడి
అస్థిపంజరాన్ని మాత్రం నిలుపుకుంటున్నాం
కాసింత తెలివి వచ్చాక అడిగాం
మా శ్రమ ఫలితం అంతా యేమయిందని

ఆ స్వార్థ కిరాత చాతకాలు కిలకిలా నవ్వి
అదంతే అన్నారు
అంతా మీకర్మ అన్నారు

ఆలోచించాం
బాధతో మూలుగుతూనే
మళ్లా మళ్లా అడిగాం
రెట్టించాం
ఏమయిందని నిలదీశాం

వినరాని మాటలు విన్నట్లుగా
అడగరాని హక్కులు అడిగినట్లుగా
రెచ్చిపోయారు వారు

మదించిన వరాహాల్లాగా
ఘుర్ఘురించారు
క్రూరదివాంధాల్లాగా
ఘూకరించారు.

మా శ్రమఫలాన్ని
మాకు పుట్టిన కొడుకులు
హక్కుతో కుడుస్తున్నట్లుగా
మింగిమింగి తెగబలిసి
ఘీంకారం చేసే మత్తేభాలను
ఇహ క్షమించే ఓపిక నశించింది

హృదయంలో ప్రతీకార భావం చెలరేగింది
మాలో ప్రతివకడూ
హర్యక్షుడై
రక్తాక్షుడై
చపేట తాడనంతో
కుంభస్థలాలను విదారితంచేసి
రుధిరాన్ని పిల్చి మస్తిష్కాన్ని జుఱ్ఱాచే
యీ తీవ్ర తీవ్ర ప్రతీకారకోపానలం
చల్లారదు
అంతవరకూ యీ క్రోధనులు శమింపరు
అక్షయం సిద్ధించే వరకూ విశ్రమింపరు

# పండుల వేషే వోటరు

ఏమిటో ఒకటే దిగులు
తలపట్టుకున్నా
పగిలిపోతున్నంత ఆలోచనలు
ఇంటా బయటా
బతికినంతకాలమూ సమస్యలు

ఇప్పటికి సలభై మూడేండ్లనాడు
అప్పటికి నాకు ఆరేడేండ్లు
బహుధాన్య ఉగాది వచ్చింది
బాగా జ్ఞాపకం
నాకప్పటికే ఊహవస్తున్నది
నాన్న ఇట్లాగే తలపట్టుకొని
కూర్చున్నాడు
నేనూ మా అన్నయ్యా, మా చెల్లీ
అందరమూ అలిగి కూర్చున్నాము
మా అమ్మ సాధిస్తున్నది
సంపాదన లేని భర్తంటే
యెంత భారతనారి అయినా
హీనంగానే చూస్తుంది

ఆనాటి మా అమ్మ సాధింపులు
మావీనుల కింపుగానే వున్నాయి

ఇన్నేండ్లు జరిగాక
ఈనాడు నేనూ
ఆనాటి మా నాన్న సమస్య
వారసత్వంలో విన్నాను

బహుధాన్య
పేరుగొప్ప ఊరుదిబ్బ
నేతిబీరకాయ
మన పేర్లన్నీ నేతి బీరకాయలే
పేరేమో వీరనారాయణ
హుఁ అని గుడ్లురిమితే
పరుగో పరుగు నారాయణ
మరొకడు సత్యనారాయణ
సత్యం వాడికెప్పుడూ అపథ్యమే

నవ్వులాటకేంగాని
అది బహుధాన్య ఉగాది
ధాన్యమే లేని ఉగాది

ఇంట్లో కొత్త బట్టలూ
అవెట్లా వుంటాయో
నా పెళ్ళి నాటికిగాని తెలీదు
అన్ని అడుక్కొని తెచ్చుకొనే బట్టలే
చిరుగులకంతా అతుకులు వేసుకొని
చిత్రాంబరాల్లా ధరించేవారం

మాతిండికి గూడ
'అడుక్కొనేవాళ్లం
అపుడప్పుడూ వండుకొనే వాళ్లం
ఇంతకూ మేమెవరమో
చెప్పలేదుగదూ
మేము పిచ్చుగుంటవాళ్ళం
పందుల మేపేవాళ్లం
అప్పటికీ యిప్పటికీ
చెట్లకిందనే జీవితం
వర్షాకాలాల్లో
మొండి గోడల సత్రాలు

*    *    *

వీధిబళ్లో నేనుగూడ
మూడోక్లాసు చదివాను
చదివితే మంచిదని వుండేదిగాని
పై చదువులకు ప్రోత్సాహంలేదు.
ఉన్నవాళ్లకేగాని లేనివాళ్లకు
చదివే సదుపాయాలు లేవు ఆనాళ్ళలో

బలిసిన పంది
మూడు మణుగులు తూగే పంది.
మూడు రూపాయలు
పొట్టేలి మాంసం వీశ అరణాలు
పందిమాంసం రెండణాలు

పందిని కోసిననాడు
మేమూ కాస్త తినేవాళ్లం
మానాన్న ఆడబ్బు కంతా
తాగేసేవాడు
ఎప్పుడు పంది నమ్మినా అంతే
మా బతుకు అడుక్కు తినడమే

ఇంత సోదెందుకుగాని
సర్వజితులో గాబోలు
నాకప్పటికి పదిహేనేళ్లు
స్వరాజ్యం వచ్చింది

అప్పట్నుండీ అందుకోసమే వచ్చినట్లు
పదవులకుపోరాటాలూ
ధరలు పెరగడాలూ మొదలు
ఈనాడు చింతపండు పదిరూపాయలు
మిరపకాయలు పదిహేనురూపాయలు
ఉల్లిగడ్డలు ?
ఉల్లిగడ్డలు గూడా మూడురూపాయలు
పచ్చడన్నా చేసుకోలేదు
సామాన్య మానవుడు.
చిత్రమేమిటంటే
ఉన్న కొన్ని మేడలూ
అంతకంతకూ అంతస్థులై
పెరిగి పెరిగి
ఆకాశంలోకి పోతున్నాయి

గుడిసెల సంఖ్య గూడా విస్తారంగా
వ్యాపిస్తున్నది
ప్రభుత్వం బడుగుజనంకోసం
ప్రణాళికలు తలపెట్టిందని విన్నాం
మా జీవితాలిప్పటికీ
ఎక్కడి గొంగడి అక్కడే.
ఇప్పటికి యాభై యేండ్లునాకు
ఎప్పటినుండో నేను వోటర్ని
సామాన్యుణ్ణి
అయిదేండ్ల కొకసారి
అసామాన్యుణ్ణి
సమ్మాన్యుణ్ణి
పందుల మేపేవాణ్ణి



# విజయ దుందుభి

సర్గా సంవత్సరం క్రితం (వచ్చిన)
దుర్మతి ఉగాదినాడు
ఈనాడు చేసినట్టుగానే
అనేక శుభగ్రహాలను
ఆవాహనం చేశాము.

ఆదేం గ్రహచార మోగాని
శుభగ్రహాల మాట అటుంచి
అశుభగ్రహాలే చరిస్తున్నాయి

దుర్మతికి స్వాగతం అంటే
తద్భిన్నంగా యెందుకుంటుంది
నామాదిరే అగుదువుగాక అని
విశ్వస్త ఆశీర్వదించినట్టు.

నేను ఎన్ని యుగాల నుండో చూస్తున్నాను
మత్స్య కూర్మ వరాహ నారసింహ
వామనరూపాలమించి
నేనూ పరిణమించాను

అంతవరకూ అవసరం వుంటేనే
ఆపూట ఆకలివరకే
ఆహార సేకరణ పరిమితం
ప్రాణిహింస పరిమితం

—

అంతటి వచన కవితలు

కాని, కావి
మానవుడు మేధావిగా పరిణమించాక
శరీర పరిశ్రమకు దొంగమరిగి
స్వార్థధూర్త దురాక్రమణ ఖావాలతో
తగలబడడం చూశాను

బహుధాన్యోత్పత్తి చేసి
బహుధా పెట్టే చేతులనే
అమాంతం మింగివేయడం చూశాను

ఎన్ని శతాబ్దాల నుండో చూస్తున్నాను
ఈ ప్రభవ విభవలూ ప్రమోదూతలూ
ధాతలూ, జయవిజయలూ
రాక్షస రౌద్రి దుర్మతులూ
ఎన్నిసార్లో వచ్చారు పోయారు
ప్రమోదానందాల పొందుతూ
పరాన్నభుక్ మంత్రాన్ని జపిస్తూ
పోయారు
పోనీ
కనీసం అరవయ్యేండ్ల క్రితం
యిదే దుందుభి ప్రవేశించిన సంవత్సరం
చింతపండు వీశ అణా
బెల్లం ఒక్క అణా
బియ్యం శేరు అణా
ముతకబట్ట మూర అణా

ఈనాడు - రోజుకు
అరపైసా గూడా చేయని పందుంపుల్లతో
అనుదినమూ
పళ్ళుతోముకొనే శ్రమ జీవికంటే
పూటకు ముప్ఫయి తొమ్మిది పైసలు
పేస్టుతో తోముకొనే పరాన్నభుక్కుకు
ఎట్లా వచ్చిందంత వైభవం - దంత వైభవం
ఎందరి పరిశ్రమను దోచకపోతే ఆ భోగం

అన్ని వస్తువుల ధరలూ మండిపోతూ
తొంభైశాతం దారిద్ర్యరేఖకు
దిగువన వుండే నిత్యశ్రామికుడికీ
కార్మికుడికీ
పచ్చడి మెతుకులకు గూడా
గతిలేని యీ రోజుల్లో
కొద్దిమంది కెట్లా వచ్చాయి
ఈ షడ్రసోపేత ఆహారాలు

ఒక్కొక్కడు వంద మంది శ్రమనైనా
దోచకపోతే
ఎట్లా వస్తాయి ఈ భోగాలు

ఈ పరాన్న భుక్కులు చేసే
దురాక్రమణలూ మానభంగాలూ

దోపిడీలూ దౌర్జన్యాలూ కోట్లకు కోట్లు పోగు చెయ్యడాలు
తమ భావి పరాన్న భుక్ సంతానం కోసం,
వారి వారసత్వ పెత్తనం కోసం
మేడల అంతస్థుల పెంచడాలూ
గుడిసెల సంఖ్య పెంచడాలూ

లాభాల లోభంతో ధరల పెంచడాలూ
నయాపైసా కక్కుర్తికి
ఆహార ఔషధాల్లో సైతం
కల్తీలు చెయ్యడాలూ
ఛీ ఛీ
ఛీ ఛీ
విసిగి పోయింది జనం
ఉత్పత్తికారులైన జనం
తాడిత పీడితజనం
ప్రతీకార భావంతో
ఉడికి పోయారు

నా హెచ్చరికను అందుకున్నారు
ఒకర్నొకరు హెచ్చరించుకున్నారు
తిరుగుబాటు భావంతో తీవ్రించిపోయారు
యుద్ధం ప్రకటించారు
అవిగో
అవిగవిగో దుందుభులు

చూస్తున్నారా
దుందుభిధ్వానాలు వింటున్నారా?
ఎటు జూచినా ఆకలిగొన్న సింహాలు
ఈనిన పులులు
తోక తొక్కిన భుజంగాలు

రక్తాక్షులై విజృంభించారు
కత్తులూ, విచ్చుకత్తులూ
కొడవళ్లూ, నాగళ్లూ
ఉలులూ, బాడిశలూ
సమ్మెటలూ, యీటెలూ

ఎత్తిపట్టుకొని,
కిల్లిల్లో కిల్లిల్లో అంటూ
సింహనాదాలు చేస్తూ
మదమల తొక్కుకుంటూ
విరుచుక పడ్డారు

ఒక్క క్షణంలో హింసాకాండ
ఒక్క క్షణంలో విధ్వంసాకాండ
ఎటుచూచినా తెగిపడిన శిరాలు
రుధిరోద్గారాలు, హాహాకారాలు
భయానకం-బీభత్సం

చూస్తున్నాను
నివ్వెరపోతున్నాను
నా ఒక్క కలంపోటు
ఎన్ని కత్తులపోట్లకు కారణమైందో
ఎన్ని కుత్తుకలు తెగిపోయాయో

కలవర పడ్డాను
ఇంకా ఉపేక్షిస్తే
ఈ విలయతాండవం
ఈ ప్రాణి విధ్వంసనం
తీవ్రం తీవ్రం అంతా ధ్వంసం
ఇంకేముంది ?
లంఘించాను
అంత యెత్తున నిలబడ్డాను.
గట్టిగా శాంతి దుందుభిని మోయిస్తూ
ఆపండి ఆపండి
అని కేక వేశాను

ఆపారు. ఆపారు. ఆపి
ఏక కంఠంగా అడిగారు
ప్రజ్వలితనేత్రాలతో
ప్రకంపిత కంఠాలతో అరిచారు
ఎందు కాపమంటున్నావ్ ?
ఎందు కాపమంటున్నావ్ ?

విజయ దుందుభి

నేను వీరరసంతో ఉప్పొంగి పోతున్నాను
కరుణ రసంతో కరిగిపోతున్నాను
అన్నాను
ఆపాలి అన్నాను
అది నా ఆజ్ఞ అన్నాను

ఎందు కాపాలి ?
ఎదురు ప్రశ్న !

ఈ విలయాగ్ని సృష్టించింది నేనే
ఈ ప్రతీకారాగ్నిని ప్రజ్వలింపజేసింది నేనే
ఈ విధ్వంసనాన్ని చూచి మేలుకొన్నదీ నేనే

హింసకు హింస జవాబుగాదు
అజ్ఞానానికి అజ్ఞానం జవాబుగాదు
అది ప్రకృతి ధర్మం
అది మానవతా ధర్మం

వినండి
స్వార్థదురాక్రమణదారులపై
ఆకలితో విజృంభించారు మీరు
వాళ్లూ మీరూ, మేమూ
ఈ ప్రకృతిని సమంగా అనుభవించాలన్న ఆశతో
దురాక్రమణ దారులపైకి విజృంభించారు మీరు

కసి కసిగా తరిగేస్తున్నారు
వాళ్లూ మిమ్మల్ని కోసేస్తున్నారు

వాళ్లూ మీరూ అందరూ చస్తారు
ఒక్కసారిగా చస్తారు

చచ్చిపోయాక
వారూ మీరూ అనుభవించేదేమిటి

ఆపండి ఆలోచించండి
చేతులు చేతులు కలపండి ఇక
పరస్పర విశ్వాసంతో ముందుకుసాగండి

ఎదురుదెబ్బ తగిలాక
జ్ఞానం ఉత్పన్నమయ్యాక
ఎవడూ ఎవణ్ణీ దురాక్రమణచేసే
ధైర్యం, ఇక రాదు ఇక రాదు

పదండి పదండి మనమందరం
ప్రకృతిని సమానంగా అనుభవిద్దాం
అక్షయంగా సహజీవనం చేద్దాం



# చైత్రరథం

కన్ను పొడుచుకున్నా కానరాని
కటిక చీకటి రాత్రి,
అహో ! అది మహాకాళరాత్రి !

ప్రకృతిలోని నలుపునంతా
తన వశం చేసుకొని

ఊర్జితమై, దశదిశలా నిండి
బ్రహ్మాండం పిక్కటిల్లే లా విజృంభించిన
వృత్రాసురాకార అంధకారం ! గాఢాంధకారం !

జారచోర ఘూకాది పీడక శక్తుల విజృంభణంతో
ప్రాణాంతకంగా తయారైన గాఢాంధకారం !

మూతలు వడ్డ నా కన్నులకు, ఏవో
ఏవేవో ఘాతుక దృశ్యాలు !
చెవులకు ఏవేవో ఆర్తనాదాలు ! పీడకలలు !

*　　　*　　　*

వేకువఝాము అయింది.
ఎంత వింత స్వప్నం ! ఎంత మంచి స్వప్నం

*　　　*　　　*

అదిగో చైత్రరథం ! అది చైత్రరథం !
ఎర్రని- లేతపచ్చని-

మామిడి ఆకుల బాకుల తోరణాలతో
పట్టల పుట్టాలు తొలగిన రంభా స్తంభాలతో,
సద్యోవికసిత శిరీష, కింశుక, సిందువార
పుష్పకి ర్మీర వర్ణాలతో
తుమ్మెదల ఝుంకారాలతో
గండు తుమ్మెదల మోతలతో సాగిపోతున్న
తుమ్మెదల తేరు.
అదే, మలయానిల రథం.

* * *

వసంతుడూ, మాధవుడూ
చెరొకవైపు చేయి పట్టుకొని
మెల్లమెల్లగా సానందంగా
చైత్రుని నడిపించుకుంటూ, సాగుతున్నట్లుగా
మందయానంతో వయ్యారంతో
నడుస్తున్న ఆ తెమ్మెరల తేరులో

ఉదయారుణ భానుబింబ ముఖతిలకంతో,
ధగద్ధగాయమాన కోటి ప్రభలతో,
కోహినూరు వజ్ర కిరీటధారి, భారతమాత – అదిగో
అల్లదిగో కోహినూరు వజ్ర కిరీటధారి భారతమాత...

ఆమె ప్రక్కన్నే-అదిగో-ఆమె ప్రక్కన్నే-
కుందన కాంతులు వెదజల్లు అందాలబొమ్మ,
నానా వసంత పుష్పాభరణ మండిత
నానా విధ రత్నాభరణ జాజ్వల్యమాన కిరణ మండిత-
మధురాతి మధుర సుందర వదనారవింద-

కించిద్వ్యహసిత మందహాస సుందర బింబాధర
ఆమే మన అమ్మ! ఆంధ్రమాత
ఆరుకోట్ల ఆంధ్రుల కన్నతల్లి - తీయని తెనుగు తల్లి

*　　　　*　　　　*

రథం సాగుతోంది
ఉండి ఉండి పరుగు లంకించుకుంది.
ఆ పరుగుల నంటి నా చూపులు పరుగిడుతున్నాయి

*　　　　*　　　　*

హఠాత్సంఘటన
క్రేంకార ధ్వని చేస్తూ అరదం ఆగింది.

*　　　　*　　　　*

అనల చక్ర పరివేష్టితమై
కనలి కెంపెక్కి తీవ్రించి పోతున్న ముఖంతో
అక్షయ తూణీరం నుండి - నిరంతరాయంగా లాగిలాగి
పుంఖానుపుంఖంగా ఆగ్నేయాస్త్రాల ప్రయోగిస్తున్నది
భారతమాత
ఎదురుగా సుదూరంలో
భయవిహ్వల ఆర్తనాదాలు - చావుకేకలు - మూల్గులు.

*　　　　*　　　　*

తెలుగుతల్లి చూపుల్లో, రక్తారుణ భీకరద్యుతులు
క్రోధానల జ్వాలాతోరణాలు

## ఆంతటి వచన కవితలు

అలా కాదక్కా ఆగు ఆగక్కా !
ఒక్కొక్కరిపై ఒక్కొక్క బాణాన్ని ఎంత సేపు
ప్రయోగిస్తావు !

బ్రహ్మాస్త్రం సంధించక్కా ఒక్కసారిగా
బ్రహ్మాస్త్రం ప్రయోగించు
ఈనికృష్ట సృష్టిని భస్మీపటలం చెయ్యి

కులమత దురహంకారులు - దురాక్రమణ పరులు
స్వార్థాసూయాగ్రస్తులు - దౌర్జన్య పీడాకరులు - హింసాత్ములు
ఈ మానవులు, సామ్యవాద విరోధులు
చీలి, చీలి. చక్కజెయ్యడానికి గూడా వీలు కాకుండా పోయారు
స్వార్థం పెట్రేగి దయాదాక్షిణ్యాలూ నీతి నియమాలూ
కలికానికి గూడా లేకుండా అయిపోయారు.
వీరందరినీ దమియించు
ధ్వంసించు

*　　　*　　　*

సంతానం ఎంత దుష్టమైంది కాకపోతే
కన్న తల్లే కత్తి కడుతుంది !!
కన్న కడుపుకే కత్తికోతగా తయారైన, ఈ దుష్టమానవ
సంతానాన్ని గ్రసించు
అక్కా సంహరించు

*　　　*　　　*

నాకు మెలకువ వచ్చింది
ఆశ్చర్యంగా కళ్లు తెరిచాను
అప్పటికే తెల్లవారింది
గబగబా - తెమ్మెరల తేరు, మాయమైన చోటికి నడిచాను.

* * *

ఎట్టఎదుట అంతస్థుల మేడలు కొన్ని
వాటిని పరివేష్టించి అంతకు నూరంతలున్న పూరి గుడిసెలు
అంతకంతకూ అణగారిపోతున్న పూరి గుడిసెలు
అందులోనే సీరా, సారా, దుకాణాలు! బ్రాంది షాపులు!

* * *

అటు జనం వైపు చూశాను
ఇది ఉగాది! ప్రభవ ఉగాది.
అరవై యేళ్ల తర్వాత పునః ప్రభవిస్తున్న ప్రభవ ఉగాది.

* * *

మేడలు హుషారుగా - హడావుడిగా వున్నాయి
అభ్యంగన స్నానాలు చేసి, దుకూల వస్త్రాలు ధరించి
మర్మర ధ్వనులతో, అటూ యిటూ - తిరుగుతున్నారు వారి పిల్లలు!
ఇటు వైపు పూరి గుడిసెల్లోని పురుషులు తిట్టు కూతలు కూసుకుంటూ
కల్లూ సారాయి దుకాణాల్లోకి అప్పటికే హాజరు
వాళ్ల పిల్లలవైపు చూశాను - ఆ బీద పిల్లల వైపు చూశాను
ఆ దరిద్ర సంతానం వైపు చూశాను.

ఆకలికి కారిన కన్నీళ్లు పొట్టలపై చారలు గట్టి
ఇంకా తేమగానే వున్నాయి
పీలికలు చుట్టుకొని అర్ధనగ్నంగా
మేడల పిల్లలవైపు దీనంగా అసూయగా చూస్తున్నారు
ఉగాదినాడు ఏమితింటే
ఆ సంవత్సరమంతా అదే లభిస్తుందంట!
బిడ్డలకు ఏమి బట్టలు కట్టాలి?
ఏమి తిండి పెట్టాలి?
దిగులుగా చూస్తున్నారు గుడిసెల ఆడువారు
అదృశ్యాల చూస్తున్న నాకు,
కడుపులో చేయిపెట్టి దేవికట్లయింది
ఇది దురన్యాయం!
ఇది దుష్ట నీతి అని ఎన్నిసంవత్సరాలుగానో
నా కవి హృదయం క్షోభిస్తూనే వుంది
ఈ దుర్వ్యవస్థకు కారకులెవ్వరు? ఎవ్వరు?
ఈనాటి వేకువ స్వప్నం నాకొక ఉపశృతి అయింది.
గబగబా గదిలోకి దూరి కలాన్ని అందుకున్నాను.
బ్రహ్మాస్త్రంలాంటి కలాన్ని వాడిసి పట్టుకున్నాను

(ప్రభవ ఉగాది, తేది 30-3-1987)